## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

| Scriptures, Slokas and Stotras | | General | Downloads |
|---|---|---|---|
| Adi Sankaracharya<br>Aditya<br>Adwaitam<br>Ayyappa<br>Bhagavad Geetha<br>Bammera Pothana<br>Bhagavatam<br>Brahma Sutras<br>Durga<br>Dattatreya<br>Ganesh<br>Gayatri<br>Guru<br>Hanuman<br>Hindu Marriage System<br>Krishna<br>Lakshmi<br>Mahabharat<br>Mantrapushpam<br>Narada Bhakti Sootralu<br>Nava Grahas<br>Patanjali Yoga Sootralu<br>Raghavendra<br>Rama<br>Ramayanam | Rama Geeta<br>Saraswathi<br>Sandharbha<br>Satya Sai<br>Shirdi Sai<br>Siva<br>Slokas with meaning<br>Subrahmanya<br>Suktas<br>Sundara Kanda<br>Venkatesa<br>Vishnu<br>Vratas<br>Upanishads<br>Rigveda<br>Samhitaanuvadam<br>(Yoga Paranga)<br>Vyasa Bhagavatam | Appeal and Objectives<br>Bala Basha<br>Bhakti Celebrities<br>Bhakti Classicals<br>Bhakti Links<br>Book Reviews<br>Jeji Mamayya Patalu<br>Chatuvulu<br>Dasa Mudrani<br>Divine Guidance of Satya Sai<br>Kavitha Kadambam<br>Keerthanalu<br>Koonalamma Padalu<br>Prasnalu - Javaabulu<br>Naturopathy<br>Rishi Vani<br>Sai Krishna's Art<br>Satakalu<br>Swamiji<br>Tatvalu<br>Telugu Special<br>Useful Links<br>Value Education<br>Web Hunt<br>Hindu Cultural<br>Questions & Answers<br>Yoga<br>Yoga Mudralu Bandhalu<br>Yogasanas (Detailed) | Audio Downloads<br>Bhakti Screen Savers<br>Printer Friendly Page<br>**Pravachanaalu**<br>Bhaja Govindam<br>Bhasmo Dhulita Vigrahaya<br>Karma Siddhantam<br>Class Prayers<br>Kenopanishad<br>Sri Narasimha Charitram<br>Soundarya Lahari<br>Ramana Saranagathi<br>Vivekachoodamani<br>**Specials**<br>Annamayya Pada Visleshana<br>Monthly<br>Satsang<br>Chinna Kathalu<br>Class Prayers<br>Human Relations<br>Nadiche Devudu<br>Stories of Alwars<br>Stories of Bhaktas<br>Stories of Indian Sages<br>Stories of Nayanars<br>Sankara Vangmayamu<br>Special Articles<br>Hinduism and Mantras<br>Personality Development |

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

Telugu Bhakti Pages

**www.telugubhakti.com**

**Printer friendly version**

**Join Telugu Bhakti Pages group to get updates/ to participate in Dharmic discussions and to share thrilling religious views and divine experiences.**

**Click http://groups.yahoo.com/group/TeluguBhaktiPages/**

# కేనోపనిషత్తు

శాంతి మంత్రం

ఓం ఆప్యాయన్తు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమింద్రియాణిచ సర్వాణి।
సర్వం బ్రహ్మౌపనిషదం మా ఽహం బ్రహ్మనిరాకుర్యాం మామా బ్రహ్మ నిరాకరోదనిరాకరణ మస్త్వనిరాకరణం మే ఽస్తు। తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తేమయిసన్తు తేజమయిసన్తు॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

మమ - నా ; అంగాని - అవయవాలు; అప్యాయన్తు - శక్తివంతములగు గాక; ఆథో - ఇంకనూ; వాక్ - వాక్కు; ప్రాణః - ప్రాణం; చక్షుః - కన్ను; శ్రోత్రమ్ - చెవి; బలమ్ - శక్తి; సర్వాణి - అన్ని; ఇంద్రియాణి - ఇంద్రియాలు; చ - కూడ; ఔపనిషదం - ఉపనిషత్తులో చెప్పబడిన; బ్రహ్మ - బ్రహ్మం; సర్వం - సమస్తం; అహం - నేను; బ్రహ్మ - బ్రహ్మాన్ని; మాని రాకుర్యాం - నిరాకరింపకుందును గాక; బ్రహ్మ - బ్రహ్మం; మా - నన్ను; మాని రాకరోత్ - నిరాకరింపకుండుగాక; అనిరాకరణం - నిరాకరించకుండటం; మే - నాయెడల;అస్తు - ఉండుగాక; ఉపనిషత్సు - ఉపనిషత్తులతో; యే - ఏఏ, ధర్మాః - ఉత్తమ గుణాలు; (ఉన్నవో);తే - అవన్నీ; తదాత్మనివిరతే - ఆ ఆత్మలో శ్రద్ధగల;మయి - నాయందు; సన్తు - ఉండుగాక.

నా అవయవాలు శక్తివంతాలగుగాక. నా వాక్కు, ప్రాణాలు, కళ్లు, చెవి మరియు అన్ని ఇంద్రియాలు శక్తివంతాలగుగాక. ఈ సకలబ్రహ్మాండము వేదాంతవేద్యమైన బ్రహ్మమే. ఎన్నడూనేను బ్రహ్మాన్ని నిరాకరించకుందునుగాక. బ్రహ్మం నన్ను నిరాకరింపకుండుగాక (అనగా నేను ఆ బ్రహ్మమే కదా!). నా నిరాకరణం బ్రహ్మంలో లేకుండుగాక. బ్రహ్మనిరాకరణం కనీసంనాలో లేకుండుగాక. ఉపనిషత్తుల్లో చెప్పబడిన ఉత్తమగుణాలు ఆత్మనిరతుడైన నాయందు నిలుచుగాక. నా యందు ఆ సకలధర్మములు నెలకొనుగాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

# కేనోపనిషత్తు - మొదటిభాగం

కేనేషితం పతతి ప్రేషితం మనః

కేనప్రాణః ప్రథమః ప్రైతియుక్తః।

కేనేషితాం వాచమిమాం వదన్తి

చక్షుః శ్రోత్రం క ఉ దేవోయునక్తి॥ 1

మనః - మనస్సు; కేన - దేనిచేత; ప్రేషితం - పంపబడి, పతతి - తన పనులుచేయ దుముకుచున్నది; కేన - ఎవనిచేత; యుక్తః - నియోగింపబడి;ప్రథమః - ముఖ్యమైన;ప్రాణః - ప్రాణం, ప్రైతి - తన పనులపై సంచరిస్తుంది; కేన - దేనిచేత;ఇషితామ్ - ఇష్టాన్ని అనుసరించి;ఇమామ్ - ఈ; వాచమ్ - మాటలు; వదన్తి - మానవులు పలుకుతారు?;చక్షుః - కన్ను; శ్రోత్రం - చెవి; ఉ - నిజానికి; కః -ఏ; దేవః - తేజోవంతుడు; యునక్తి- నియమించుతాడు?

శిష్యుడు : మనస్సుని దాని విషయాలపైకి పడేటట్లు ఏది ప్రేరేపిస్తుంది? దేనిచేత ప్రయోగించబడి ప్రాణం తన పనులను కొనసాగిస్తుంది? దేని ఇష్టాన్ని అనుసరించి మానవులు మాటలు మాట్లాడుతారు? నిజంగా ఏ బుద్ధి కళ్లను చెవులను నియమిస్తుంది?

శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్

వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః।

చక్షుషశ్చక్షురతి ముచ్యధీరాః

ప్రేత్యాస్మాల్లోకా దమృతాభవన్తి॥ 2

యత్ - ఏదైతే; శ్రోత్రస్య - చెవియొక్క; శ్రోత్రమ్ - చెవియో; మనసః - మనస్సుయొక్క; మనః - మనస్సో; వాచః - వాక్కుయొక్క; హ - నిజంగా; వాచమ్ - వాక్కు; సః - అదే; ఉ - మరియు; ప్రాణస్య - ప్రాణంయొక్క; ప్రాణః - ప్రాణమో; చక్షుషః - కన్నుయొక్క, చక్షుః - కన్నో (ఈ విధంగా తెలుసుకుని ఆత్మ ఈ ఇంద్రియాలూ మొదలైనవే అన్న

భ్రాంతి); అతి ముచ్య - వదిలించుకుని; ధీరాః - బుద్ధిమంతులు, అస్మాత్ - ఈ; లోకాత్ - ఇంద్రియ జీవనం నుండి; ప్రేత్య - తప్పకొని: అమృతాః - అమరులు; భవన్తి - అవు తారు.

ఆచార్యుడు: ఆత్మ శక్తివలననే చెవి వింటుంది. కన్ను చూస్తుంది. జిహ్వ మాట్లాడుతుంది. మనస్సు గ్రహిస్తుంది. ప్రాణాలు పనిచేస్తాయి. బుద్ధిమంతుడు ఆత్మను ఈ ఇంద్రియ వ్యా పారాలనుండి వివక్షిస్తాడు.ఇంద్రియబద్ధమైన జీవితాన్ని దాటి అమరత్వాన్ని పొందుతాడు.

నతత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్ గచ్ఛతి నోమనః।
న విద్మో న విజానీమో యథైత దనుశిష్యాత్ ॥ 3

తత్ర - ఆబ్రహ్మవిషయములో; చక్షుః - కన్ను, నగచ్ఛతి - పోజాలదు; నవాక్ - మాటలు (పోజాలవు); న ఉ మనః - మనస్సుకూడ (పోజాలదు); (తత్ -అది); న విద్మః - మాకు తెలియదు; యథా - ఎలాగ; ఏతత్ - దీనిని; అనుశిష్యాత్ - నేర్పించవచ్చునో; (తత్ అపి - అదికూడా); న విజానీమః - మాకు తెలియదు.

ఆ బ్రహ్మవిషయములో కన్ను పోజాలాదు మాటలుగాని మనస్సుగాని పోలేవు. కాబట్టి మాకు దాని గురించి తెలియదు. దాన్ని ఏవిధంగా నేర్పించ వచ్చునో ఆ పద్ధతి కూడా మాకు తెలియదు.

అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి ।
ఇతి శుశ్రుమ పూర్వేషాం యేనస్తద్ వ్యాచచక్షిరే॥ 4

తత్ - అది; విదితాత్ - తెలిసినదానికంటే; ఏవ - నిశ్చయంగా; అన్యత్ - భిన్నమైనది; అథో -ఆపైన; అవిదితాత్ - తెలియని దానికంటె; అధి - అతీతమైనది;యే - ఎవరైతే; సః - మాకు;వ్యాచచక్షిరే - వివరించారో; పూర్వేషాం - పూర్వీకులనుండి; ఇతి - ఇలా;శుశ్రుమ - మేం విన్నాం.

నిశ్చయంగా అది తెలసిన దానికంటె భిన్నమైనది. ఆ తరువాత అది తెలియనిదానికంటే అతీతమైంది. దానిని మాకు వివరించిన పూర్వీకులనుండి మేం ఈ విధంగా విన్నాం.

యత్ వాచా నభ్యుదితం యేన వాగభ్యుద్యతే।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥ 5

యత్ - ఏదైతే, వాచా - మాటలచేత; అనభ్యుదితమ్ - ప్రకటింపబడదో, యేన - దేనిచే త;వాక్ - మాటలు; అభ్యుద్యతే - ప్రకటింపబడుతాయో; తత్ ఏవ - అది మాత్రమే; బ్రహ్మ - బ్రహ్మం అని; త్వమ్ - నువ్వు; విద్ధి - తెలుసుకో; యత్ - ఏదైతే; ఇదమ్ - ఈ : ఉపాసతే - జనులు పూజిస్తూ ఉన్నారో; ఇదమ్ - ఇది; న - కాదు.

మాటలు దేన్ని ప్రకటించలేవో మాటలనే ఏది ప్రకటిస్తుందో అది మాత్రమే బ్రహ్మం అనీ ఈ జనులు పూజించేది కాదనీ తెలుసుకో.

యన్మనసా నమనుతే యేనాహుర్మనో మతమ్।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥ 6

యత్ - ఏది (ఏ ప్రత్యగాత్మ చైతన్యము); మనసా - మనస్సుచే; న మనుతే - గ్రహించ బడదో; యేన - దేనిచేత (ఏ ప్రత్యగాత్మ చైతన్యము చేత); మనః - మనస్సు; మతమ్ (ఇతి) - సంకల్పాదులలో ప్రసరించును(అని): ఆహుః- చెప్పదురో:తత్ ఏవ - అది మాత్రమే; బ్రహ్మ - బ్రహ్మం అని; త్వమ్ - నువ్వు; విద్ధి - తెలుసుకో; యత్ - ఏదైతే;ఇదమ్ - ఈ : ఉపాసతే - జనులు పూజిస్తూ ఉన్నారో; ఇదమ్ - ఇది; న - కాదు.

మనస్సుచేత గ్రహించ శక్యం కానిదీ, దేనిచేత మనస్సు సంకల్పాదులలో తిరుగునో అది మాత్రమే బ్రహ్మం అనీ, ఈ జనులు ఇక్కడ పూజించేది కాదనీ తెలుసుకో.

యచ్చక్షుషా న పశ్యతియే న చక్షూంషి పశ్యతి।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥ 7

యత్ - దేనినైతే; చక్షుషా - కన్నులచేత; న పశ్యతి - (మానవుడు) చూడడో; యేన - దేనిదేత; చక్షూంషి - కన్నులను; పశ్యతి - చూస్తాడో; తత్ ఏవ - అది మాత్రమే; బ్రహ్మ - బ్రహ్మం అని; త్వమ్ - నువ్వు; విద్ధి - తెలుసుకో; యత్ - ఏదైతే; ఇదమ్ - ఈ :ఉపాసతే - జనులు పూజిస్తూ ఉన్నారో; ఇదమ్ - ఇది; న - కాదు.

కన్నులు చూడజాలనిది కాని దృష్టిని చూచేది - అది మాత్రమే బ్రహ్మం అనీ, ఈ జనులు ఇక్కడ పూజించేది కాదనీ తెలుసుకో.

యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతమ్।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥ 8

యత్ - దేనిని;శ్రోత్రేణ - చెవిద్వారా; నశృణోతి - మానవుడు వినజాలడో, యేన - దేని చేత;ఇదం - ఈ; శ్రోత్రం - వినికిడి; శ్రుతం - వినబడుతుందో: తత్ ఏవ - అది మాత్రమే; బ్రహ్మ- బ్రహ్మం అని; త్వమ్ - నువ్వు; విద్ధి - తెలుసుకో; యత్ - ఏదైతే; ఇదమ్ - ఈ: ఉపాసతే - జనులు పూజిస్తూ ఉన్నారో; ఇదమ్ - ఇది; న - కాదు.

మానవుడు చెవిద్వారా వినజాలనిదీ దేనిచేత వినికిడి వినబడుతున్నదో - అది మాత్రమే బ్రహ్మం అనీ, ఈ జనులు ఇక్కడ పూజించేది కాదనీ తెలుసుకో.

యత్ ప్రాణేన న ప్రాణిత యేన ప్రాణః ప్రణీయతే।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥ 9

యత్ - దేనినైతే ; ప్రాణేన - ఊపిరిచేత; నప్రాణిత - వాసన చూడ జాలడో; యేన - దేనిచేత; ప్రాణః - ఊపిరి; ప్రణీయతే - శ్వాసోచ్ఛ్వాసములను సలుపునో: తత్ ఏవ - అది మాత్రమే;బ్రహ్మ - బ్రహ్మం అని; త్వమ్ - నువ్వు;విద్ధి - తెలుసుకో;యత్ - ఏదైతే; ఇదమ్- ఈ :ఉపాసతే - జనులు పూజిస్తూ ఉన్నారో; ఇదమ్ - ఇది; న - కాదు.

మానవుడు ఊపిరి చేత వాసన చూడజాలడో, దేనిచేత ఊపిరి శ్వాసోచ్ఛ్వాసములను సలుపునో - అది మాత్రమే బ్రహ్మ అనీ ఈ జనులు ఇక్కడ పూజించే ఇది కాదనీ తెలుసుకో.

ఇది ప్రథమభాగము

రెండవ భాగము

యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి

నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్।
యదస్యత్వం యదస్య దేవేష్వథను
మీ మాంస్య మేవతే మన్యే విదితమ్॥ 1

యది - ఒకవేళ, సువేద ఇతి - బ్రహ్మతత్వం నాకు బాగా తెలుసును అని; మన్యసే - అనుకున్నట్లయితే; నూనం - నిశ్చయంగా; త్వం - నువ్వు; దభ్రమ్ ఏవ - చాలా కొంచెం మాత్రమే;అపి - బహుశా; బ్రహ్మణః - బ్రహ్మం యొక్క; రూపమ్ - రూపం; వేత్థ - తెలుసు కున్నావు; త్వమ్ - నువ్వు; (ప్రాణులలో) అస్య - ఈ బ్రహ్మం యొక్క, యత్ - ఏ; రూపమ్ - రూపం;వేత్థ - తెలుసుకున్నావో; అపిచ - ఆపైన, దేవేషు - దేవతలలో; అస్య - దాని యొక్క;యత్ - ఏ; (రూపం తెలుసుకున్నావో నిజంగాఅదంతా చాలా కొంచెమే) ఆథ మ - అందుచేత ఇక; తే - నీకు; (బ్రహ్మం); మీ మాంస్యమ్ ఏవ - తెలుసుకోవలసిన విషయమే; విదితం - (నాకు బ్రహ్మం) తెలిసిందని; మన్యే - అనుకుంటూన్నాను.

ఆచార్యుడు : నేను బ్రహ్మతత్వాన్నిగూర్చి బాగానే తెలుసుకున్నాను అని ఒకవేళ అనుకున్న ట్లయితే నువ్వు తెలుసుకున్నది చాలా స్వల్పం; ఎందుకంటే నువ్వు చూచే ప్రాణులలో దేవతలలో పరిచ్ఛిన్నమైన బ్రహ్మం రూపం అతి స్వల్పం. కాబట్టి బ్రహ్మాన్ని గూర్చి నువ్వు ఇం కా తెలుసుకోవలసి ఉంది.

శిష్యుడు : (మళ్లా చింతనచేసి బ్రహ్మం సాక్షాత్కరించుకొని) బ్రహ్మం తెలుసుకున్నానని అనుకుంటున్నాను.

నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చ।
యోనస్తత్ వేద తద్వేదనో న వేదేతి వేద చ॥ 2

అహం - నేను; సువేద ఇతి - చక్కగా తెలుసినది అని, నమన్యే - అనుకోను; నో న వే ద ఇతి- తెలియనిది అనుకొనను, వేదచ - తెలుసుకూడా; నః - నా తోసి విద్యార్థులలో, యః - ఎవరు; న ఉ న వేద - తెలయనిదికాదు; నో వేద ఇతిచ - తెలిసనదికూడా; తత్ - అది; వేద - తెలుసును; (అతడు); తత్ - దానిని (ఆ బ్రహ్మమును) వేద - తెలుసు కున్నాడు.

నాకు బాగా తెలుసును అని నేను అనుకోను. నాకు తెలియదు అని కూడా కాదు. తెలు సుకూడా. నా తోడివిద్యార్థులలో అది తెలియనది కాదు అనీ, తెలిసినది అనీ గ్రహించిన వాడుదానిని గ్రహించగలడు.

యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః।

అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్॥ 3

(బ్రహ్మతత్వం) యస్య - ఎవనికి; అమతమ్ - తెలియదో; తస్య - అతనికి; మతమ్ - తెలుసును;యస్య - ఎవనికి; మతమ్ - తెలుసునో;సః- అతడు,న వేద - తెలుసుకోలేదు; (యస్మాత్ - ఎందుకంటే) విజానతాం - తెలిసినవారికి;(పండితులకు) (బ్రహ్మతత్వం) అవిజ్ఞాతం - తెలియనిది;అవిజానతాం - అజ్ఞానులకు (తెలియని వారికి); విజ్ఞాతం - తెలిసినది.

ఏ బ్రహ్మవేత్త తనకు బ్రహ్మం తెలియదని భావించునో వాడు దాన్ని తెలుసుకుంటాడు.

ఏ బ్రహ్మవేత్త తనకు బ్రహ్మం తెలుసునని భావిస్తాడో వాడు దాన్ని తెలుసుకోలేదు. బ్రహ్మవేత్తలు రెండుతెగలు. బ్రహ్మము తెలిసినది అనుకొనువారు. వీరికి బ్రహ్మముతెలయనిది కాని రెండవతెగవారు బ్రహ్మము తెలియదు అనుకొనువారు.వీరికి బ్రహ్మము తెలియును.

ప్రతిబోధవిదితం మత మమృతత్వం హి విన్దతే।

ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విన్దతే౭మృతమ్ ॥ 4

ప్రతిబోధ విదితం మతం - ఎవడు అన్ని మనోవికారాల ద్వారా బ్రహ్మం స్ఫూర్తి గోచరం చేసుకున్నాడో (అతడు); అమృతత్వం - అమరత్వాన్ని; హి - నిశ్చయంగా, విన్దదే- పొందుతాడు, ఆత్మనా - ఆత్మచేత; వీర్యం - నిజమైన బలం; విన్దతే - లభిస్తుంది; విద్యయా- (పరమాత్మను గూర్చిన) జ్ఞానం ద్వారా; అమృతమ్ - అమరత్వం; విన్దతే - పొందుతాడు.

మనస్సుచెందే ప్రతి వికారంద్వారా దాన్ని స్ఫూర్తిగోచరంచేసుకున్నవాడు అమరత్వాన్ని పొందుతాడు. ఆత్మద్వారా అతడు నిజమైనబలాన్ని పొందుతాడు. జ్ఞానం ద్వారాఅమరత్వాన్ని పొందుతాడు.

ఇహ చేద వేదీ దథ సత్యమస్తి

న చేదిహావేదీ న్మహతీ వినష్టిః।

భూతేషు భూతేషు విచిత్య ధీరాః

ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి॥ 5

ఇతి ద్వితీయ ఖండః

ఇహ - ఇక్కడ; అవేదీత్‌చేత్ - తెలుసుకున్నట్లయితే, అథ - ఆపైన; సత్యమ్ - (నిజమైన జీవనం) సత్యం; అస్త - ఉన్నది; ఇహ - ఇక్కడ; న అవేదీత్‌చేత్ - తెలుసుకోనట్లయితే; (తదా - అప్పుడు); మహతీ - గొప్ప; నినష్టిః - వినాశః, (తస్మాత్ - అందుచేత);ధీరాః - ప్రజ్ఞావంతులు;భూతేషు భూతేషు - అన్ని జీవాలలో; (ఆత్మ తత్త్వమును); విచిత్య - సాక్షాత్కరించు కుని, అస్మాత్ లోకాత్ - ఇంద్రియ జీవనం నుండి (లేదా ఈ లోకం నుండి); ప్రేత్య - నిష్క్రమించి;అమృతాః - అమరులు; భవన్తి - అవుతారు.

ఇక్కడ ఈ ప్రపంచంలో దాన్ని సాక్షాత్కరించుకున్నట్లయితే ఆపైన నిజమైన జీవితం ఉన్నది. ఇక్కడ సాక్షాత్కరించుకోనట్లయితే సర్వనాశనమే.ప్రతి జీవిలోనూ ఆత్మను వివక్షించు కుంటూ ప్రజ్ఞాశాలి ఇంద్రియ జీవనాన్ని అతిక్రమించి అమరత్వాన్ని పొందుతాడు.

మూడవ భాగం

బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే, తస్యహ

బ్రహ్మణో విజయే దేవా అమహీయన్త।

త ఐక్షన్తాస్మాకమేవాయం విజయో౽

స్మాకమేవాయం మహిమేతి॥ 1

బ్రహ్మ - బ్రహ్మం; దేవేభ్యః - దేవతలకు; విజిగ్యే - జయం చేకూర్చెను; హ - అని కథ; తస్య బ్రహ్మణః - ఆ బ్రహ్మంయొక్క; విజయే - జయంలో; దేవాః - దేవతలు; అమహీయన్త - మహిమాన్వితులయ్యారు;తే - వారు; అయమ్ - ఈ; విజయః - విజయం, ఏవ - నిజంగా; అస్మాకం - మాదే; అయమ్ - ఈ; మహిమా - ఘనత; ఇతి -అని; ఐక్షన్త - తలచిరి.

ఆచార్యుడు : బ్రహ్మం ఒకప్పుడు దేవతలకు (రాక్షసులపైన) విజయం సంపాదించిందని కథ. విజయం బ్రహ్మంవలనే ఐనా, దానివలన దేవతలు మహిమాన్వితులయ్యారు. నిజంగా మేమే గెలిచాం, మాదే ఈ ఘనత దేవతలు తలపోసారు.

తద్ధైషాం విజజ్ఞౌ, తేభ్యోహ ప్రాదుర్బభూవ

తన్న వ్యజానత కిమిదం యక్షమితి 2

(బ్రహ్మం) హ - అప్పుడు; ఏషామ్ - వారి(దేవతల); తత్ - ఆ (గర్వం); విజజ్ఞౌ - తెలుసు కున్నది; తేభ్యః - వారికి (ఎదుట); ప్రాదుర్బభూవ - తాను ఆవిర్భవించింది; తత్ - ఆ; ఇద మ్ - ఈ; యక్షమ్ - దివ్యతేజము; కిమ్ - ఏమిటో; ఇతి - అని; నవ్యజానత - (వారికి) తెలియలేదు.

దేవతల ఈ గర్వం బ్రహ్మం తెలుసుకున్నది. వారి ఎదుట దివ్యతేజమై సాక్షాత్కరించింది. కాని ఆ అపురూపమైన శక్తి ఏమిటో వారికి అర్థం కాలేదు.

తేఽగ్ని మబ్రువన్, జాతవేద; ఏతద్

విజానీహి కిమేతద్ యక్షమితి; తథేతి॥ 3

తే - వారు; (దేవతలు); అగ్నిమ్ - అగ్నితో; అబ్రువన్ -ఇలా అన్నారు; జాతవేదః - ఓ జాతవే దుడా!; కిమ్ ఏతత్ యక్షమ్ ఇతి - ఈ శక్తి ఏమిటో అని; ఏతత్ - ఇది; విజానీహి - తె లుసుకో; తథా - అలాగే; ఇతి - అని (అగ్ని అన్నాడు).

దేవతలు అగ్నిదేవునితో "ఓ జాతవేదుడా (సర్వజ్ఞుడు) ఈ అపురూపమైన శక్తి ఏమిటో తె లసుకో" అన్నారు. అందుకు అగ్నిదేవుడు ఒప్పుకున్నాడు.

తదభ్యద్రవత్, తమభ్యవదత్ కోఽసీతి, అగ్నిర్వా

అహమస్మీత్య బ్రవీజ్జాతవేదా వా అహమస్మీతి॥ 4

(అగ్నిః - అగ్ని) తత్ - ఆ దివ్యతేజమువద్దకు; అభ్యద్రవత్ - త్వరగా వెళ్లాడు; తమ్ - అతని ని;(ఆ దివ్యతేజము) కః అసి ఇతి - నువ్వు ఎవరవు అని అభ్యవదత్ - అడిగింది; అహమ్ - నేను, అగ్నిః వైఅస్మి - అగ్నిని కదా; ఇతి - అని; అహమ్ - నేను; జాతవేదాః అస్మి - జాత వేదుడను; ఇతి - అని; అబ్రవీత్ - అన్నాడు.

అగ్ని ఆ దివ్యశక్తి వద్దకు వేగంగా వెళ్లాడు. నీ వెవరివని ఆ శక్తి అతణ్ణి ప్రశ్నించింది. నేను అగ్నిని. సర్వజ్ఞుణ్ణి" అని అగ్ని బదులిచ్చాడు.

తస్మిం స్త్వయి కింవీర్య మిత్యపీదం సర్వం

దహేయం యదిదం పృథి వ్యామితి ॥ 5

తస్మిన్ త్వయి - (అలాంటి కీర్తిగల) నీలో; కిమ్ - ఏమి; వీర్యమ్ - శక్తి; ఇతి - అని (ఆ శక్తి అడిగింది); పృథివ్యామ్ - భూమిమీద; యత్ ఇదమ్ - ఏదేది; (ఉన్నదో); ఇదమ్ - ఇది;

సర్వం అపి - అంతా కూడా; దహేయమ్  కాల్చివేయగలను; ఇతి - అని (అగ్ని) అన్నాడు. ఐతే నీలో ఏం శక్తి ఉంది? అని ఆ దివ్యశక్తి అడిగింది. భూమ్మీద ఏదేది ఉందో అంతటి నీ నేను దహించివేయగలను అన్నాడు అగ్నిదేవుడు.

తస్మైతృణం నిదధావేతద్ దహేతి।

తదుపప్రేయాయ సర్వజవేన తన్న

శశాకదగ్ధుం స తత ఏవ నివవృతే నైత

దశకం విజ్ఞాతుం యదేతద్ యక్షమితి॥ 6

ఏతత్ - దీన్ని; దహ - కాల్చు; ఇతి - అని (చెప్పి); తస్మై - అతనికి (ఎదుట); తృణమ్- గడ్డి పోచను; విదధౌ - ఉంచింది; , సర్వజవేన - (అగ్ని) యావచ్ఛక్తితో; తత్ - దాన్ని; ఉప ప్రే యాయ - సమీపించాడు, తత్ - దాన్ని దగ్ధుమ్ - కాల్చుటకు, నశశాక - అసమర్థుడ య్యాడు; సః - అతడు (అగ్ని); తతః - అక్కడినుండి; నివవృతే ఏవ - మరలిపోయాడు, యత్ - ఏదో, ఏతత్ - ఈ, యక్షమ్ - దివ్య శక్తి, ఏతత్ - ఇది; విజ్ఞాతుమ్ - తెలసుకో డానికి,  అశకమ్ - నాకు శక్యం కాలేదు; ఇతి - అని (దేవతలకు చెప్పాడు).

ఆ దివ్య శక్తి అతని ఎదుట ఒక గడ్డిపోచను ఉంచి కాల్చు అన్నది. అగ్ని తన యావచ్ఛక్తి తో ప్రయత్నించాడు కాని ఆ గడ్డిపోచను కాల్చలేకపోయాడు.అగ్నిదేవుడు దేవతల వద్దకు మరలిపోయి ఈ అపురూపమైన శక్తి ఏమిటో నేను తెలుసుకోలేకపోయాను అన్నాడు.

అథవాయు మబ్రువన్, వాయువేతద్

విజానీహి కిమేతద్ యక్షమితి; తథేతి॥ 7

అథ - అప్పుడు; వాయుమ్ - వాయువుతో; అబ్రువన్ - (దేవతలు) ఇలా అన్నారు; వాయో -ఓ వాయుదేవా (కదిలేవాడు); కిమ్ - ఏది; ఏతత్ - ఈ; యక్షమ్ ఇతి - దివ్య శక్తిఅని), ఏతత్ - ఇది; విజానీహి - తెలుసుకో; తథా ఇతి - అలాగే అని (వాయువు అన్నాడు)

అప్పుడు దేవతలు వాయుదేవునితో ఓ వాయుదేవా, ఈ అసాధారణమైన శక్తి ఏమిటో కనుక్కో అన్నారు. అతడు అందుకు అంగీకరించాడు.

తదభ్యద్రవత్ తమభ్యవదత్ కోऽసీతి।

వాయుర్వా అహ మస్మీత్యబ్రవీన్మాతరిశ్వా వా అహమస్మీతి॥ 8

(వాయుః - వాయువు); తత్ - ఆ దివ్యతేజము వద్దకు; అభ్యద్రవత్ - వెళ్లాడు; తమ్ - ఆ వాయుదేవుని; అభ్యవదత్ - ఆ శక్తి ఇలా అడిగింది; కః - ఎవరు;అసి ఇతి - నువ్వు అని; వాయుః - వాయువును; వై అహమ్ అస్మి ఇతి - కదా నేను అని; మాతరిశ్వా - మాతరిశ్వుడను : వై అహమ్ అస్మి ఇతి - కదా నేను అని, అబ్రవీత్ - అన్నాడు.

వాయువు ఆ అసాధారణశక్తి వద్దకు వేగంగాపోయాడు. ఆ శక్తి నీ వెవరు అని అతణ్ణి అడిగింది. నేను వాయువును, గాలికి ప్రభువును అని అతడు సమాధానం చెప్పాడు.

తస్మిం స్త్వయి కిం వీర్యమిత్యపీదం

సర్వమాదదీయ యదిదం పృథివ్యామితి॥ 9

తస్మిన్ త్వయి - (అటువంటి ప్రశస్తిగల) నీలో; కిమ్ - ఏమి; వీర్యం - శక్తి; ఇతి - అని ఆ దివ్యశక్తి అడిగింది; ఇదం సర్వం - ఇది అంతా; అపి - కూడా; ఆదదీయమ్ - నేను ఎగరగొట్టగలను; యత్ఇదమ్ - ఏదైనాసరే, పృథివ్యామ్ - భూమిమీద; ఇతి - అని (ఆ వాయుదేవుడు బదులు పలికాడు.)

ఐతే నీలో ఏం శక్తి ఉంది? అని ఆ దివ్య శక్తి అడిగింది. భూమ్మీద ఉన్నదేదైనా నేను ఎగురగొట్టగలను అన్నాడు వాయుదేవుడు.

తస్మైతృణం నిదధాతే తదాదత్స్వే తి।
తదుపప్రేయాయ సర్వజవేన, తన్న శశా
కాదాతుం, స తత ఏవ నివవృతే। నై తద
శకం విజ్ఞాతుం యదేతద్ యక్షమితి॥ 10

ఏతత్ - ఇది, ఆదత్స్వ - ఎగరగొట్టు; ఇతి - అని; తస్మై - అతని ఎదుట; తృణమ్ - గడ్డిపో చను; నిదధౌ - ఉంచింది; తత్ - దాన్ని, సర్వజవేన - తన యావచ్ఛక్తితో; ఉపప్రేయా య - (వాయువు) సమీపించాడు;తత్ - దానిని, ఆదాతుమ్ - ఎత్తుకోడానికి; నశశాక - శక్తుడు కాలేదు; తతః- అక్కడినుండి; సః - అతడు; నివవృతే ఏవ - మరలిపోయాడు; యత్ - ఎవరు; ఏతత్ - ఈ; యక్షమ్ - శక్తి; ఏతత్ - ఇది; విజ్ఞాతుమ్ - తెలుసుకోవ డానికి; న అశకమ్ - నాకు  శక్యం కాలేదు; ఇది - అని; (అతడు మరలిపోయి దేవతల తో అన్నాడు.)

అతని ఎదుట ఆ దివ్యశక్తి ఒక గడ్డిపోచను ఉంచి దీన్ని ఎగురగొట్టు అంది. వాయువు తనసర్వశక్తిని ప్రయోగించాడు కాని ఆ గడిపోచకదలలేదు. అందుచేత దేవతల వద్దకు మరలిపోయి ఈ అపురూప శక్తి ఏమిటో తెలుసుకోలేకపోయాను అని దేవతలతో అన్నాడు.

అథేంద్రమబ్రువన్, మఘవన్నే
తద్విజానీహి, కిమేతద్
యక్షమితి; తథేతి; తదభ్య
ద్రవత్; తస్మాత్ తిరోదధే॥ 11

అథ - అప్పుడు; ఇంద్రమ్ - ఇంద్రుడితో (దేవతలకు ప్రభువు); అబ్రువన్ - (దేవతలు) ఇ లాఅన్నారు; మఘవన్ - ఓ ఇంద్రా, కిమ్ - ఏమిటి; ఏతత్ - ఈ; యక్షమ్ - శక్తి; ఇతి ఏతత్ -అని ఇది; విజానీహి - తెలుసుకో; తథా - అలాగే; ఇతి - అని (ఇంద్రుడు పలికా డు); తత్ - దానివద్దకు; అభ్యద్రవత్ - వెళ్ళాడు; తస్మాత్ - ఆ ఇంద్రునినుంచి; తిరోదధే - ఆ దివ్యతేజముమాయమైపోయింది.

అప్పుడు దేవతలు ఇంద్రుడితో ఓ దేవేంద్రా! ఈ అపురూపమైన శక్తి ఏమిటో తెలుసుకో అన్నారు. ఇంద్రుడు సరేనన్నాడు.ఆ శక్తి వద్దకు త్వరత్వరగా వెళ్లాడు. కాని దివ్యశక్తి అతని ఎదుటనుండి అంతర్ధానమైంది!

స తస్మిన్నే వాకేశే స్త్రియ

మాజగామ బహుశోభమానాముమాం

హైమవతీం; తాం హోవాచ

కిమేతద్ యక్షమితి॥ 12

సః - అతడు (ఇంద్రుడు); తస్మిన్ - ఆ; ఏవ ఆకాశే - ఆకాశంలోనే; బహుశోభ మానమ్ - అత్యంత అద్భుత సౌందర్యవతియైన; స్త్రియమ్ - యువతిని; ఆజగామ - వచ్చింది, తామ్ - ఆమెను, హైమవతిని - బంగారు నగలు గలదానిని (హిమంతుని కుమార్తెను); ఉమామ్ -ఉమదేవిని; ఉవాచహ - అడిగాడు, కిమ్ - ఏమిటి, ఏతత్ - ఈ;యక్షమ్ - శక్తి;ఇతి - అని

ఆకాశ స్థలంలోనే ఇంద్రుడు అత్యంత అద్భుత సౌందర్యవతియైన ఒక యువతిని, హిమ వంతుని కుమార్తెను చూశాడు.ఆమెను అడిగాడు.ఈ అపురూపమైన దివ్యశక్తి ఏమిటి? మూడవ భాగం సమాప్తం.

నాలుగవ భాగం

సా బ్రహ్మేతి హోవాచ॥

బ్రహ్మణో వా ఏతద్ విజయే

మహియధ్వమితి; తతో హైవ

విదాఞ్చకార బ్రహ్మేతి॥ 1

సా - ఆమె; (ఉమాదేవి); బ్రహ్మ - బ్రహ్మం; ఇతి - అని; ఉవాచహ -చెప్పెను ; బ్రహ్మణః -బ్రహ్మంయొక్క; విజయే - విజయంతో; ఏతత్ - ఇది; మహియ ధ్వమ్‌వై - మీరు ఘనత వహించారు గదా; ఇతి - అని, తతః - దాన్నుండి; హవై - మాత్రమే; ఏతత్ - ఇది; బ్రహ్మ - బ్రహ్మం; ఇతి - అని; విదాంచకార - అతడు తెలుసుకున్నాడు.

ఆచార్యుడు:అది బ్రహ్మం అని బ్రహ్మం విజయం వలన కదా మీరు మహిమాన్వితులయ్యా రుఅని ఉమాదేవి అన్నది. ఆ దివ్యశక్తి బ్రహ్మం అని ఇంద్రుడు అప్పుడు తెలుసుకున్నాడు.

తస్మాద్ వా ఏతే దేవా అతితరా

మివాన్యాన్ దేవాన్, యదగ్ని ర్వా

యురింద్రస్తే హ్యేనన్నే దిష్ఠం పస్పర్శుస్తే

హ్యేనత్ ప్రథమో విదాంచకార బ్రహ్మేతి॥ 2

తే - ఆ; అగ్నిః వాయుః ఇంద్రః - అగ్ని వాయువు ఇంద్రుడు; ఏనత్ - ఈ (బ్రహ్మన్ని); నేదిష్ఠ మ్- అత్యంత సన్నిహితమైనది; పస్పర్శుఃహి - స్పృశించినారు కదా;యత్ - కనుక; తేహి -వారే; ప్రథమః - మొదట; ఏనత్ - ఇది (దివ్యశక్తి); బ్రహ్మ - బ్రహ్మం; ఇతి - అని; విదాం చకార - తెలుసుకున్నారు; తస్మాత్ - అందుచేత, వై - కదా; ఏతే - ఈ; దేవాః - దేవతలు ; అన్యాన్ - ఇతర; దేవాన్ - దేవతలను; అతితరామ్ ఇవ - అతిశయిస్తారు.

అందుచేతనే గదా ఈ దేవతలు - అగ్ని వాయువు ఇంద్రుడు - ఇతర దేవతలను అధిగ మించినది. వారే ఆ శక్తికి అ్యతంత సమీపంగా వెళ్లారు. అది బ్రహ్మం అని తెలుసుకోవ డంలో వారే ప్రపథములు.

తస్మాద్ వా ఇంద్రోఽతితరా

మివాన్యాన్ దేవాన్; సహ్యేనన్నే

దిష్ఠం పస్పర్శ, స హ్యేనత్

ప్రథమో విదాంచకార బ్రహ్మేతి॥ 3

సఃహి - ఆ ఇంద్రుడు; ఏనత్ - ఈ బ్రహ్మంను; నేదిష్ఠమ్ - అత్యంత సమీపమున (బ్రహ్మే న్ని); పస్పర్శ - స్పృశించాడు; హి - కనుక; సః - అతడు; ఏనత్ - ఇది, బ్రహ్మ - బ్రహ్మం; ఇతి - అని; ప్రథమః - మొదట; విదాంచకార - తెలుసుకున్నాడు; తస్మాత్ వై - కనుకనే; ఇంద్రః - ఇంద్రుడు; అన్యాన్ దేవాన్ - ఇతర దేవతలను; అతితరామ్ ఇవ - అతిశయిస్తా డు కూడా.

ఇంద్రుడు ఈ బ్రహ్మం ను సమీపంలో స్పృశించాడు. అందుచేతనే గదా ఇంద్రుడు ఇతర దేవతలను అధిగమించినది! అతడే ఆ దివ్యశక్తి బ్రహ్మం అని తెలుసుకోవడంలో అతడే ప్రథముడు. ఇంద్రుడే బ్రహ్మవేత్తలలో మొదటివాడు.

తస్యైష ఆదేశః యదేతద్ విద్యుతో వ్యద్యుతదా
ఇతీన్న్యమీమిషదా ఇత్యధి దైవతమ్॥ 4

తస్య - దానియొక్క (బ్రహ్మతత్వం యొక్క); ఏషః - ఈః; ఆదేశః - వర్ణన; యత్ ఏతత్ - ఏదైతే; విద్యుతః - మెరుపుయొక్క వ్యద్యుతత్ - మెరుము; ఆ -ఆహో! న్న్యమీమిషద్ ఇతి ఆ - రెప్పలు ఆర్చేటట్లు చేస్తున్నది. ఆహో; ఇతి అధిదైవతమ్ - దేవతలకు లేదా ప్రకృతి శక్తులకు సంబంధించినంతవరకు.

బహ్మం వర్ణన ఇది: అహో! మిరుమిట్లుగొలుపు మెరుపును ప్రకాశింపజేసేది ఆ బ్రహ్మమే. మనిషిని రెప్పలు ఆర్చేటట్లు చేసేది ఆ బ్రహ్మమే. ప్రకృతి శక్తులుగా ఆ బ్రహ్మం అభివ్యక్తీకర ణకు సంబంధించినదిగా చెప్పవలసింది ఇది.

అథా ధ్యాత్మం యదేతద్ గచ్ఛతీవ చ
మనో౽నేన చైతదుపస్మరత్యభీక్ష్ణం సంకల్పః॥ 5

అథ - ఇక; అధ్యాత్మమ్ - ఆత్మలోనే దాని అభివ్యక్తి దృష్ట్యా దాని వర్ణన; యత్ ఏతత్ అనే న - ఈ బ్రహ్మం వల్ల; మనః - మనస్సు; ఏతత్ - దీనిని (ఈ ప్రపంచాన్ని); గచ్ఛతి ఇవ చ - తెలుసుకుంటుంది; అభీక్ష్ణమ్ - ఎల్లప్పుడు; ఉపస్మరతి - జ్ఞాపకం ఉంచుకుంటుంది; సంకల్పః చ - ఊహిస్తుంది కూడా.

ఇప్పుడు ఆత్మలో బ్రహ్మం అభివ్యక్తీకరణం అన్న దృక్కోణం నుండి దాని వర్ణనను గురించి; ఆ బ్రహ్మంవలననే మనస్సు ఈ బాహ్య ప్రపంచాన్ని తెలుసుకుంటుంది. జ్ఞాపకం ఉంచు కుంటుంది, వస్తువులను ఊహించుకుంటుంది.

తద్ధ తద్వనం నామ
తద్వనమిత్యుపాసితవ్యం;
సమ ఏతదేవం వేదాభిహైనం
సర్వాణి భూతాని సంవాఞ్ఛంతి॥ 6

తత్‌హ - అది (బ్రహ్మం); తద్వనమ్ నామ - తద్వనం అని పేరు బడెను; తద్వనమ్ ఇతి - తద్వనమ్‌అని; ఉపాసితవ్యమ్ - ధ్యానింపవలెను; సః - అతడు; యః - ఎవరైతే; ఏతత్ - ఇది (బ్రహ్మం); ఏవమ్ - ఇలా; వేద - తెలుసుకుంటాడో (ధ్యానిస్తాడో); ఏనమ్ - ఇత నిని(ఉపాసకుడిని);సర్వాణి భూతాని - అన్ని జీవాలూ, అభిసంవాంఛ్ఛంతి - ప్రేమిస్తాయి.

బ్రహ్మం తద్వనం అనీ అన్ని జీవులకూ ఆత్మగా ఆరాధింపదగినదనీ ప్రసిద్ధి చెందింది. కాబట్టి దాన్ని తద్వనంగా ధ్యానించాలి ఇలా తెలుసుకున్న వానిని సకల జీవులూ ప్రేమి స్తాయి.

ఉపనిషదం భో బ్రూహీత్యుక్తా త ఉపనిషద్

బ్రాహ్మీం వావ త ఉపనిషదబ్రూమేతి॥ 7

భోః - ఆచార్యవర్యా; ఉపనిషదమ్ - ఉపనిషత్తును; బ్రూహి - (నాకు) చెప్పండి; ఇతి - అని (శిష్యుడు అడిగాడు); తే - నీకు; ఉపనిషత్ - ఉపనిషత్తు; ఉక్తా - చెప్పబడింది: బ్రాహ్మీమ్ - బ్రహ్మనికి సంబంధించిన; ఉపనిషదమ్ - ఉపనిషత్తును; వావ - కదా; తే - నీకు, అబ్రూమ - చెప్పాం, ఇతి - అని; (అతడు బదులు చెప్పాడు).

శిష్యుడు : ఆచార్యవర్యా, నాకు ఉపనిషత్‌ని ఉపదేశించండి.
ఆచార్యుడు : నీకు ఉపనిషత్తు ఉపదేశించబడింది. నిజంగా బ్రహ్మం గూర్చిన ఉపని షత్తు నీకు ఉపదేశించాం.

తస్యై తపోదమః కర్మేతి ప్రతిష్ఠా

వేదాః సర్వాంగాని సత్య మాయతనమ్॥ 8

తపః - తపస్సు; దమః - నిగ్రహం; కర్మ ఇతి - యజ్ఞనిధులు (ఏకనిష్ఠమైన కర్మ); తస్యై - దానియొక్క (ఉపనిషత్తుయొక్క); ప్రతిష్ఠా - పాదాలు; (వాటిపైన అది నిలుస్తుంది); వే దాః - వేదాలు; సర్వాంగాని - అన్ని అవయవాలు; సత్యం - సత్యం; ఆయతనమ్ - నివాస స్థానం.

తపస్సు, నిగ్రహం, నిష్ఠా పూర్వకమైన కర్మ ఇవి దానికి (ఉపనిషత్తులోని బ్రహ్మ జ్ఞానానికి) మూలభిత్తికలు. వేదాలు దాని సర్వాంగాలు. సత్యం దాని నివాస స్థానం.

యోవా ఏతామేవం వేదాపహత్య పాప్మాన

మనన్తే స్వర్గేలోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి। 9

ఇతి చతుర్థః ఖణ్డః

యం - ఎవరైతే; వై - నిజంగా; ఏతామ్ - దీనిని (ఉపనిషత్తును) ఏవమ్ - ఇలాగ; వేద - తెలుసుకుంటాడో; (సః - అతడు); పాప్మానమ్ - పాపాన్ని; అపహత్య - నశింపజేసి; అ నన్తే - శాశ్వతమైన; జ్యేయే - అత్యున్నతమైన, మహత్తమమైన; స్వర్గేలోకే - బ్రహ్మంలో లేక ఆనంద మయమైన స్వర్గంలో; ప్రతితిష్ఠతి - నివసిస్తాడు; (రెండవ ప్రతితిష్ఠతి - ఉపనిష త్తు సమాప్తిసూచిస్తుంది).

నిజంగా, ఇలా ఉపనిషత్తును తెలుసుకున్నవాడు పాపాన్ని నిర్మూలించుకుంటాడు. అనం తము మహోన్నతమూ ఆనందమయమూ ఐన బ్రహ్మంలో ప్రతిష్ఠితుడౌతాడు. అవును దాన్లో ప్రతిష్ఠితుడౌతాడు.

శాంతి మంత్రం

ఓం ఆప్యాయన్తు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమింద్రియాణిచ సర్వాణి।

సర్వం బ్రహ్మోపనిషదం మా ౭౭ హం బ్రహ్మనిరాకుర్యాం మామా బ్రహ్మ నిరాకరోదనిరాకర ణ మస్త్వనిరాకరణం మే ౭౭ స్తు। తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తేమయిసన్తు తేజమయిసన్తు॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

మమ - నా ; అంగాని - అవయవాలు; అప్యాయన్తు - శక్తివంతములగు గాక; ఆథో - ఇంకనూ; వాక్ - వాక్కు; ప్రాణః - ప్రాణం; చక్షుః - కన్ను; శ్రోత్రమ్ - చెవి; బలమ్ - శక్తి; సర్వాణి - అన్ని; ఇంద్రియాణి - ఇంద్రియాలు; చ - కూడ; ఔపనిషదం - ఉపనిషత్తులో చెప్పబడిన; బ్రహ్మ - బ్రహ్మం; సర్వం - సమస్తం; అహం - నేను; బ్రహ్మ - బ్రహ్మాన్ని; మాని రాకుర్యాం - నిరాకరింపకుందును గాక; బ్రహ్మ - బ్రహ్మం; మా - నన్ను; మాని రాకరోత్ - నిరాకరింపకుండుగాక; అనిరాకరణం - నిరాకరించకుండటం; మే - నాయెడల;అస్తు - ఉండుగాక; ఉపనిషత్సు - ఉపనిషత్తులతో; యే - ఏఏ, ధర్మాః - ఉత్తమ గుణాలు; (ఉన్నవో);తే - అవన్నీ; తదాత్మనివిరతే - ఆ ఆత్మలో శ్రద్ధగల;మయి - నాయందు; సన్తు - ఉండుగాక.

నా అవయవాలు శక్తివంతాలగుగాక. నా వాక్కు, ప్రాణాలు, కళ్లు, చెవి మరియు అన్ని ఇంద్రియాలు శక్తివంతాలగుగాక. ఈ సకలబ్రహ్మాండము వేదాంతవేద్యమైన బ్రహ్మమే. ఎన్నడూనేను బ్రహ్మాన్ని నిరాకరించకుందునుగాక. బ్రహ్మం నన్ను నిరాకరింపకుండుగాక (అనగా  నేను ఆ బ్రహ్మమే కదా!). నా నిరాకరణం బ్రహ్మంలో లేకుండుగాక. బ్రహ్మనిరాకరణం కనీసంనాలో లేకుండుగాక. ఉపనిషత్తుల్లో చెప్పబడిన ఉత్తమగుణాలు ఆత్మనిరతుడైన నాయందు నిలుచుగాక. నా యందు ఆ సకలధర్మములు నెలకొనుగాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః